





# మహిళలు

## జీవిత చరిత్ర,ధర్మాలు

# పురాణ పతివ్రతలు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014986

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పురాణ పతివ్రతలు

గ్రంథకర్త:

బులుసు-వేంకటరమణయ్యగారు

శ్రీరామచన్ద్రాయ నమః.

# పురాణపతివ్రతలు.

Purana pati pratalu.

## సేవ్యాదేవి.

౧

పూర్వము ప్రతిష్ఠాననగరమునఁ గౌశికుఁ డనునొక బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. తొలిజన్మమున నాతఁడు జితేంద్రియుఁడు కానికారణమున నీజన్మమునఁ దత్ఫలముగ నాతనిశరీరమునఁ గుష్ఠరోగము వ్యాపించెను. ఆరోగమున నతనిశరీరమునిండ వ్రణములు లేచి వానినుండి చెడునెత్తురు, చీము కాఱుచు నెంతటిసహనశీలురకైన నసహ్యముఁ గొల్పుచుండెను. కావున నీతనిసమీపమున కెట్టిహితులైన రా వెఱచి దూరమునుండియే దృష్టిపథమునుండి మఱలుచుండిరి.

ఇట్టికుష్ఠరోగికి సంరక్షణకొఱ కెవ్వరైన నుందురా? అని పాఠకులకు సందియము కలుగవచ్చును. భగవంతుఁడు కష్టములలోఁగూడఁ జేయూఁత నొసంగునుగదా? కౌశికునకు సేవ్యాదేవి భార్య; మహాపతివ్రత. తొలిజన్మమునఁ గౌశికుఁ డజితేంద్రియుఁడైనను లెక్కలేనికన్యాదానములొనర్చుటవలన నీజన్మమునఁ దత్ఫలముగ పరమపతివ్రతయు సౌందర్యవతియు నగుభార్య యతనికి లభించెను. ఆమె యెల్లపుడును బతియం

పురాణపతివ్రతలు.

[illegible]సిక్కిశలయునుపచారములు చేయుచు సాటి పతివ్రతలలో మేలుచేయి వడసెను. ఆమె పతి నొకప్పుడైనను, మనమునందైనను బల్లెత్తుమాటాడదు. అతని వ్రణములనుండి పురుగులు కాఱుచున్న నించుకంతైన నేవగించుకొనదు. ఆహా! ఎంతటిసాధ్వి!

పూర్వజన్మవాసనాసంపర్క మీ జన్మమ్మున మొదలంట నశింపఁజాలదు. నశింపఁజాల దనియు చెప్పవచ్చును. కౌశికుఁడు తొల్లి చంచలచిత్తుఁ డగుటచే నీజన్మమునఁగూడ నతనిచిత్త మట్లే చాంచల్యమును బొందెను. అతఁ డొకనాఁడు వీధియరుఁగుపైఁ గూర్చుండియుండ నాదారిం బడి యొక వేశ్యబాల, చక్కనిచుక్క, సహజసౌందర్యవతి, ఊనషోడశవర్ష పోవుచుండుటఁ జూచెను. అదిమొద లాతఁ డామెపై మనసు నిల్పి యామెకై పరితపించి మిగులఁ గృశించి పోవుచుండెను. కాని తనయాశయము నెవరియెదుటను వెలిపుచ్చలేదు. వెలిపుచ్చినచో లాభ మేమి? ఒక్కభార్యతప్ప తనపజ్జకు వచ్చువారేరీ? భార్యతోఁ జెప్పంద మన్న, నామెతోఁ జెప్పిన నామె చేయున దేమి? ఆమెసుగుణగణములను సర్వేంద్రియప్రత్యక్షముగఁ గనుఁగొనుచున్నయాతఁ డామహాసాధ్విని బిలిచి “ఆపడపుఁగత్తెను నాకుఁ గూర్పు” మని నోటారఁ జెప్పుట యెట్లు? ఒకవేళఁ దనభార్యపాతివ్రత్యమును దా నెఱిఁగి యుండుటచే నామె నెట్టులైనఁ గార్యసాధనమునకుఁ బురికొల్పుద మన్నను, కుష్ఠరోగి నావెలయా లంగీకరించు నెట్లు? వెలయాండ్రకు ధనము ప్రధాన మైనను కుష్ఠరోగి

నెచటనైన నంగీకరింతురా? ఒకనాఁటిధనముకై వా రాశించిన, నాపై వారిజీవితము కడచు నెట్లు?

కౌశికుఁ డిట్టియాలోచనలం బడి క్రుంగిపోవుచుఁ దన యాశ యందరానిద్రాక్షపం డని తలఁచుచుండ, సేవ్యాదేవి యాతనిదరిఁ జేరి, దినదినము నాతఁడు క్రుంగిపోవుటకు మనస్తాపమే కారణ మని యెఱిఁగి "నాథా! మీ రిట్లు విచారింపఁ గతం బెద్ది? నాకును గొంచెము తెలియఁజేసినచోఁ బ్రయత్నించి తత్కార్యసిద్ధికై నాశక్తి సంతటిని వినియోగింతు"నని పల్క, నతఁడు సిగ్గు విడిచి చెప్పకున్నను మఱిమఱి వలవంతపఱచి యడుగ, నతఁడు మెలమెల్లగఁ దనయభీష్టమును దెలియఁబఱచి, యాకాంతను గూర్పనిచోఁ దనజీవితము నిలువనేర దని చెప్పివైచెను.

సేవ్యాదేవి యాపల్కు లాలించి యొకింతచకితయై "అయ్యో నానాథుఁ డెట్టికోరికఁ గోరెను? ఆయాటవెలఁది దీని కంగీకరించునా? నాపతిమనోరథముం దీర్పనినాజన్మ మేటికి?" అని లో విచారించి, తనయధైర్యమును బయటికి వెలిఁగ్రక్కక మిక్కిలిధైర్యముతో "నాథా! యీమాత్రపుదానికే మీ రట్లు విచారింపవలయునా? నేఁ దప్పక మీయభీష్టమును నెఱవేర్తును. కాని కొంచెముకాలము తాళుఁడు." అని పతికి ధైర్యముఁ గఱపి యతనిపరితాపము నొకింత చల్లార్చెను.

ఆమె ధనపతి నట్లూఱడించి రాత్రి యంతయుఁ

గార్యసాఫల్యమున కేమి చేయుదమా! యని యాలోచించెను. తుదకు వఱువాయిసరి కేదో నిశ్చయించుకొని చాల చీఁకటి యున్నపుడే లేచి తనవిభుఁడు కోరిన వెలయాలియింటి కేఁగి యాయింటిగుమ్మమును వాకిటిని శుభ్రముగఁ దుడిచి, గోమయోదకము నొత్తుగఁ జల్లి పలురకముల ముగ్గులఁ బెట్టి, త న్నెవరును జూడకుండఁ దెల్లవాఱకమునుపే తనయింటి కేఁగెను.

ఆ వేశ్య యుదయమున నీముగ్గులఁ జూచి మిక్కిలి రిచ్చపడి య ట్లెవ్వరు చేసి రని తనపరిచారికల నడుగ నం దొకతెయు సమాధానము చెప్పలేక "మాకుఁ దెలియ" దని యే పలికిరి. రెండుమూఁడుదినములవఱకును వేశ్య యుపేక్షించి, దినదినమును చిత్రవిచిత్రము లగుముగ్గులఁ జూచుచు నొకనాఁడు తానే తెల్లవాఱుజామునఁ బొంచియుండి చూడ నెంచెను.

సేవ్య దినదినమును దనకృత్యమును నెఱవేర్చుచుండెను. నాల్గవనాఁ డామెవాకిట నీళ్లు చల్లి ముగ్గులు పెట్టు నంతలో వేశ్య యామెం జూచి, యామెస్వరూపమును స్వభావమునుబట్టియే యామె మహాపతివ్రత యని తెలిసికొని యామెపాదములపైఁ బడి "తల్లీ! నీవంటివారు మాసాని గూడెమునకు వచ్చినచో నది మాకుఁ బాపాభివర్ధక మగును. నీవంటియుత్తమపతివ్రత రాఁదగినచోటా యిది? అట్టియెడ నీవు మాయింటివాకిట ముగ్గు లుంచుట న్యాయమా! తన్ను

మావాడకు రప్పించుకొనుటచే మాసంపదలు నశించును. కలుషములు పెచ్చుపెరుఁగును. తల్లీ! మాతప్పులను క్షమింపుము. నీవు కోరినకోరిక నిచ్చెదను. దయ యుంచి యింటినుండియు నీ పాపాత్ముఁరాలివాకిట ద్రొక్కు లిడకుము." అని ప్రార్థించెను. సేవ్యాదేవి యీపలుకుల కెంతయు సంతసించి తనకోరిక నెఱవేఱెఁ గదా! యని యలరి యావేశ్యం జేరి "అమ్మాయీ! నీవు చెప్పినచొప్పన నే నడచుకొందును. నాయభీష్ట మొకఁడు కలదు. దానిని మాత్రము నీవు నెఱవేర్పుము. నా మగఁడు వీధివేదికపైఁ గూర్చుండు నపుడు నీ వాదారి నేఁగితి వట! అదిమొదలు నీ సౌందర్యమునకు ముగ్ధుఁడై నిన్నే సదా స్మరించుచుఁ జిక్కి శల్యావశిష్టుఁడై యున్నాఁడు. అతఁడు కుష్ఠరోగి అయినను నీవర ప్రకారము నా యీ కోర్కి చెల్లించి నానాథుని రక్షింపుము" అని వేఁడెను.

ఈపలుకులు విని వేశ్య యొకింత నిస్తబ్ధయై యనాలోచితముగఁ దా నొసఁగినవరమునకుఁ దన్ను మనసులో నిందించికొనియు, నా మహాపతివ్రత పతిమనోరథసిద్ధికై పడుపాట్లఁ దలఁచి యేమైనను సరియే, యామెకోర్కెఁ దీర్పవలె నని నిశ్చయించుకొని "అమ్మా! నేను మీ యానతిని మీఱుదానను గాను. మీరు పతికై పడినకడగండ్లు దుర్నిరూప్యములు. ఎంతటి సాధ్వియైన, నెట్టి కఠినకార్యమునకైన సహింపఁగలదు. కాని యిట్టి రాయబారమున కంగీకరింపదు. కాని నీవు మహాపతివ్రతవు. నీమగనియభీష్టమును నేఁ దప్పక

తీర్చెదను. కాని నా కనేకులు ప్రియులు కలరు. కాన నేను వారిని సాగనంపువఱకును నీ మగనిని రప్పింపక రెండు జాములజేయినే యతనిని బంపుము.” అని విన్నవించెను.

సేవ్యాదేవి వేశ్యను విడిచివచ్చి తన మగనికీవృత్తాంతమును దెల్పెను. అతఁడమందానందము నొందియు “అయ్యో! నాకు లేచి నిలుచుటకుఁగూడ నవకాశము లేదు. ఆ వెలయాలి యింటి కెట్లేఁగువాఁడ?” అని విలపించెను. సేవ్య “నాథా! మీ కావిచారము వలదు. మిమ్ము నా వీఁపుపై నెక్కించుకొని నేనే యటకు మిమ్ముఁ జేర్చెద” నని పలికి యతనిపరితాపము నణంచెను.

౨

మాండవ్యుఁ డొక పేరెన్నికఁ గన్న మహర్షి. నిశ్చల ధ్యానపరాయణుఁడు. సర్వదా వనములోఁ దప మాచరించుకొనుచుండును. అతఁడు ధ్యాననిష్ఠలో నున్నపు డతని నెవ రేమి చేసినను, ఆతనికిఁ దెలియదు. అంతటి మహానుభావునికిఁ గూడ విధిప్రేరితము—పూర్వకర్మానుభవము తప్పినది కాదు. పూర్వజన్మమున నతఁ డొక యీలపురుగు (చిమ్మట) పొట్టికడుపునకు గడ్డిపోఁచ గ్రుచ్చి విడిచిపెట్టెను. ఆ పని యతని చిన్ననాఁటిది. పసితనమున నొకింతయు జ్ఞాన ముండదు. అపుడు కృత్యాకృత్యములుగాని ధర్మాధర్మములు గాని తెలియవు. పాపము! పసితనమునఁ జేసినయాపాపపుఁ గార్యమునకు ఫలముగ నీ జన్మమున నతనికి శూలారోప

ణము విధిలిఖిత మై యుండెను. దానిని దప్పింప నెవ్వరికిని దరము కాదుకదా!

ప్రతిష్ఠానపుర మా కాలమునఁ గల గొప్ప పట్టణము లలో నొకటి. కావున నందు చాలమంది ధనవంతులు నివసించుచుండిరి. బెల్లపుముక్క యున్నచోటు చీమ లాశ్రయించును. కాని రిక్తప్రదేశమున కవి పోఁజాలవు. ఆ రీతినే ధన మున్నచోటనే దొంగలు తిరుగుచుందురు. అచటనే రక్షకభటాలయము లుండవలెను. ఆ నగరమునఁ జోరులు ప్రవేశించి ధనికులయిండ్లకుఁ గన్నము వేసి చాల రొక్కమును ఆభరణములను దొంగిలించి పాఱిపోయిరి. ఆనగరపు రాజు సంగతిని విని రాత్రి గస్తీ తిరుగువారిం బిలిచి దొంగను బంధించి యప్పగింపనిచో శిరచ్ఛేదమును జేయింతు నని తెలిపెను. ఆ రక్షకభటు లనేకస్థలములను బరిశోధించి పరిశోధించి విసిగిపోయిరి. దొంగను బంధింప కున్నచో రాజు తప్పక తలలు తీయించు నని వెఱపుఁ జెంది యడవులఁ దిరిగి దొంగను వెదకఁజొచ్చిరి. ఆ నగర సమీపమునఁ గల యడవిలో నొక్కచోఁ గూరుచుండి ముక్కు మూసికొని జపమాచరించు మాండవ్యుఁడు వారి కంటఁ బడెను. తోడనే వారు తమ శిక్షను దప్పించుకొన నెంచి యా మహాముని కాలుసేతులు బంధించి యతఁడే దొంగ యని చెప్పి నగరమునకుఁ దీసికొనిపోయిరి. ధ్యాననిష్ఠాగరిష్ఠుఁ డగు నా మహాముని కీ యుదంతము గాని, తా నున్న రీతిగాని తెలియదు.

న్యాయవిచారదక్షుఁడు కాని రాజు కొంచెమైన నాలో చింపక, నేరమును విమర్శింపక దొంగ దొరకె నను వార్త వినిన వెంటనే యతనికి శూలారోపణశిక్షను విధించెను. రాజభటులు తదాజ్ఞగ నా మునిని శిక్షింప శృంగాటకామధ్యమున శూలమును బాతి దానిపై నాతని నెక్కించిరి. అట్లే యతనిశిరమునఁ గూడ నొకశూలమును నిలిపిరి. కాని యా ముని కీయుదంత మేమియుఁ దెలియదు.

రాత్రి దాదాపు రెండు యామముల సమయ మయ్యెను. నగర మంతయు నిశ్శబ్దమై యుండెను. జగ మంతయును దమోవ్యాప్తమై యేదియును దృగ్గోచరము కాకుండెను. అట్టి నడిరేయి మహాపతివ్రత యగు సేవ్యాదేవి తన మగని యభీష్టమును నెఱవేర్ప నెంచి యతనిని దన వీఁపుపై నెక్కించుకొని సానిగూడెమునకు బయలుదేఱెను. ఆహా! ఏమి యామెపాతివ్రత్యము! కౌశికుఁడు తాఁ గోరిన కోరిక చాల ననుచితమైన దనియు, తనభార్య నేతత్కార్యసాధనమునకుఁ బురికొల్పుట కేవలము వనితాలోకగర్హ్యమనియుఁ, తనకు శక్తి లేక యామెవీఁపు నధిరోహించి పోవుటకంటె మహాపాతకము వేఱు లేదనియు నెఱుఁగును. కాని యాతని మనఃప్రవృత్తి యతిచంచలమైనది. మనోనిగ్రహసమర్థుఁడు కాకుండుటంబట్టియే యతఁ డిట్లు కుష్ఠరోగి కావలసివచ్చెను. ఆ వాసనం బట్టియే ధర్మము నధర్మము జయించినది. తా నొనర్చుపని కాతనికి విచారము కలిగెనే కాని యదియు క్షణికమే యయ్యెను.

సేవ్యాదేవికిఁ దా నొనర్చుకార్యమునెడ సంతసమే కల్గెను. తనపతిసంతోషమే తనసంతోషము. అతనిసుఖమే యామెసుఖము. కావున నామె యొకించుకంతయును జంకు లేక యత్యుత్సాహమునఁ దనభర్తను గడుఁ దేలికగ నాపడపుకత్తెయింటికిఁ దీసికొనిపోవుచుండెను. ఆమె కీడగు వనితామణి కలదా ?

నగరరథ్యలు నిబిడాంధకారవ్యాపృతము లగుటచే నామెకు దారి యేదియో తెలియలేదు. ఒకవేళ దీపికను జేతఁ బట్టుకొని పోవుద మన్న, తమకృత్యముం గని యెవ్వ రేమి పరిహసింతురో యని యామె తలఁచెను. తన కెట్టి యవమానము కలిగిన నామె సహింపఁగలదు. కాని తనపతి కవమానము కలిగిన నామె భరింపఁజాలదు కదా! మార్గము తెలియకున్నను, ఆమె తనముక్కునకు సూటిగఁ బోవుచుండెను. కానఁ జీఁకటిలో నామెకు శృంగాటకామధ్యమున నున్నశూలము కాని, దానిపై నున్నమాండవ్యముని కాని కన్పింపలేదు. ఆమె శూలమున కెదురుగఁ బోవుటచేఁ గౌశికునిశరీరము మాండవ్యునికిఁ దగిలెను. అంతవఱకును దన సంగతి నెఱుఁగక యోగనిద్ర నున్నమునికి, కుష్ఠరోగిసంపర్కజనితానాచారమున వ్రతభంగ మయ్యెను. తోడనే ముని తెలివి తెచ్చుకొని మిగులం గినిసి "నన్ను స్పృశించి నావ్రతమునకు భంగ మొనర్చి నన్నవమానపఱచినఖలుఁడు సూర్యోదయ మైనవెంటనే యసువులఁ బాయుఁగాక !" యని నిర్దయముగఁ గౌశికుని శపించెను. మునిశాపమును

వినినవెంటనే సేవ్యాదేవి గొడ్డలిపెట్టునం బడుచెట్టువలెం బడి, మూర్ఛ నొంది, కొంతపడికిం దెలి వొంది మిగుల విల పించెను. ఆపై నొకపరి తనమగనిం దనహృదయపీఠమున నిల్పి "నేనే పతివ్రత నగుదునేని యింక సూర్యుం డుదయింప కుండుంగాక!" యని మిక్కిలిదారుణ మగుశాపము నిచ్చెను." రవి యుదయింపనిచో లోకములు నశింపవచ్చును. నశించిన నశింపనిండు. ఆమెపతి సజీవుండై యుండుటయే యామెకుం గావలసినపని. తక్కినలోకము నశించిన నామెకు నష్ట మేమి? పతికంటెం బతివ్రతకుం బ్రపంచము ముఖ్యము కాదుగదా! పతివ్రతాశాప మూరక పోవునది కాదు. ఎన్నియామములు గడచినను లోకమునకు సూర్యదర్శనభాగ్యము లభింపలేదు.

పెక్కుదినములు గడచెను. సూర్యుం డుదయింప కుండుటచే లోకవ్యవహారము లేమియు సాగుటలేదు. రాత్రిం దివవిభాగములును మాసఋతుపరిమితులును దెలియలేదు. స్నానాధ్యయనాదులు సాగుటలేదు. నగరారణ్యములకు భేదము లేకుండెను. ఎల్లెడల వింతవింత లగురోగములు పుట్టి ప్రజానాశనము చేయుచుండెను. లోక మిట్టివిషమస్థితి నుండు టచే దేవత లందఱును దల్లడిల్లి దేవేంద్రుని బురస్కరించు కొని బ్రహ్మపాలికిం జని తమయిక్కట్టుల నతిదీనముగ విన్న వించి తమసూర్యుని మఱలం దమకుం బ్రసాదింపవలె నని వేడుకొనిరి. బ్రహ్మయుం దనదివ్యజ్ఞానమున సూర్యోదయా భావమునకుం గలకారణము నెఱింగి దేవేంద్రాదిదేవతలతో

గూడఁ బ్రతిష్ఠానపురమునకుఁ బయనమై సేవ్యాదేవిగృహ
మును జేరిరి.

తేజోవంతు లగు దేవతలు విమానారూఢు లై భువి
నవతరించుటచే వేయిమందిసూర్యు లుదయించినట్లుండెను.
అట సేవ్య తనమగనిశయ్యపైఁ బరుండఁబెట్టి శుశ్రూషల
నొనర్చుచు నావెలుంగుఁ జూచి "ఏమి! సూర్యోదయ మైనదా
యేమి? నేఁటితో నాపతికి నూరేండ్లు నిండినవా? నాపతికిని
నాకును ఋణము చెల్లినదా?" యని నెత్తి నోరు కొట్టు
కొనుచు, నేలపైఁ బొరలుచు విలపించు చుండెను. అప్పుడు
తేజోవంతు లగు బ్రహ్మాది దేవత లామెచెంతకు రాఁగా,
సూర్యోదయము కాలేదనియు, నావెలుఁగు దేవతలతేజమే
యనియు నెంచి, యామె వారి కుచితరీతిని సత్కారంబుల
నొనరించెను. అపై నలువ యామెను బొగడి "అమ్మా!
మమ్ము నందఱను రక్షింపుము.సూర్యుఁ డుదయింపకుండుటచే
లోకము తల్లడిల్లుచున్నది. కనుక ననుగ్రహించి నీశాపము
నింకనైన నుపసంహరించుకొనుము. అమ్మా! మాండవ్యముని
నీపతియెడ నపచార మొనర్చిన, లోకమును హింసించుట
తగునా! తల్లీ! చతుర్దశభువనజీవరాసులును నీయనుగ్రహము
పై నాధారపడియున్నవి. కాన రక్షింపుము తల్లీ!" యని
వేఁడుకొనెను. సేవ్య యాపల్కు లాలించి "జగత్కారణమ
వగునోతండ్రీ! నేఁడు మీదర్శనభాగ్యము లభించుటచే
నాపాపము లడంగినవి. పరమర్షులకుంగూడ నందరానిమహా
ఫలము లభించినది. ఏతల్లాభమున నాధర్మప్రవర్తన కింకను

గొంతచేయూఁత లభించినది. తండ్రీ! నావలనఁ దప్పు కలదే? మాండవ్యమహర్షి దయ మాలి నాపతిని శపించెను. సూర్యుఁ డుదయాద్రిం బొడుచునేని నాపతి యసువులఁ బాయును. పతివ్రాణకుఁ బతికంటె వేఱెగతి కలదే? ఇట్టిచో నాశాపము నుపసంహరించుకొను టెట్లు?'' అని పలికెను. విరించి యామాటల్కు లాలించి ''అమ్మా! నీవలన దోషము కలదని యే మనఁగలవారమే? నీవు పరమసాధ్వి యాచరించు తెఱంగున నొనరించితివి. కాని, దానివలన నతిస్వల్పలాభమును సకలలోకనష్టమును గల్గుచున్నవి. ఇట్లే కొలఁదిదినము లున్నచో లోకములు నిర్జీవములు కాఁగలవు. కాన నొక్కని ప్రాణము రక్షించుట యుక్తమో, లేక లోకముల నన్నింటి నుద్ధరించుట మేలో నీవే యాలోచింపుము'' అని పలికెను.

సేవ్యాదేవి యామాటలు విని బ్రహ్మాదుల నించుకంత యును లక్ష్యముసేయక తిరస్కారముగ ''తండ్రీ! మంచినీతు లనే యుపదేశించుచున్నావు. చాలు చాలు. పతివ్రతకుఁ బతి కంటె వేఱుగతి కల దనుట నీకుఁ దగదు. నాకుఁ బతికంటె లోకము లాప్తతమములు కాఁజాలవు. పతి లేనిచో నాకీజగ మంధకారబంధుర మగును. లోకములు నశించు ననుచున్నావు. నశించిన నశింపనిమ్ము. నాపతి సురక్షితముగ నుండి తక్కిన లోకములు నశించినను నాకుఁ బరితాపము కలుగదు. పతి మరణించుపదపడి పొలఁతికిఁ గల్గు వైధవ్యదుఃఖముకంటె నసహ్య మగుదుఃఖము వేఱు కలదే; కాన నామాట లాలించి నన్నుఁ బీడింపక పొండు. మీతో వాదులాడుచు మత్పతి

శుశ్రూష నొనర్చుట కాలసించుచున్నాను. మీ రీకార్య ముకొఱకే వచ్చినచో దయ యుంచి మరలిపొండు. నా యీ సమాధానమునకుఁ గినియక నన్ను మన్నింపుఁ'' డని వాక్రుచ్చెను.

దేవత లందఱు నీపల్కు లాలించి నివ్వెఱపడిరి. తమ కింక రవిదర్శనభాగ్యము లేదనియే తలంచిరి. దేవేంద్రుఁడు తన వేయికన్నులనుండియు జాలి గొల్పుచూడ్కులఁ బ్రసరించి విరించిం జూచెను. హిరణ్యగర్భుండును '' పాకశాసనా ! మనము చేయవలసినప్రయత్నము లొనర్చితిమి. ఇంతటితో మనసామర్థ్య మంతరించినది. సేవ్యాదేవి మహాపతివ్రత. పాతివ్రత్యతేజఃప్రభావ మింతింత యని చెప్ప నలవి కాదు. ఆమె యొకటిరెండు మాటలతో మనలను జీవాట్లుపెట్టి పంపినది. ఇఁక మీ రొక్కపనిమాత్ర మొనర్పుఁడు. పతివ్రతలు పతివ్రతలకే లొంగుదురు. వజ్రమును ఛేదింప వజ్రముననే కాని మఱియొకదానికి సామర్థ్యము లేదు. కావున మీరు వేగముగ ననసూయాదేవియొద్దకుఁ బొండు. పోయి మీ గోడు నెఱింగింపుఁడు. ఆమె సేవ్యవలెనే మహాపతివ్రత. ఆమె తల యూఁచినచో మనకార్యము సఫల మైనట్లే తలంపుఁడు.'' అని పల్కి తా నంతర్ధాన మొందెను.

అంత దేవేంద్రాదు లనసూయాదేవి కడకుం జని యామెయడుగుఁదమ్ములపై వ్రాలి '' తల్లీ! రక్షింపుము, రక్షింపుము. నీవు తక్క వేఱొకయాధారము లేదు. నీ వెట్లు

లైనను సేవ్యాదేవి నొప్పించి మాకు సూర్యలాభమును బ్రసాదింపు" మని ప్రార్థించిరి. అనసూయయు బాగుగ నాలోచించి "సరే మీరు పొండు. నేఁ బ్రయత్నించి తప్పక మీయభీష్టమును నెఱవేర్తును." అని దేవతల కభయహస్తము నిచ్చి తనపతి నుచితరీతిం బూజించి, తదాజ్ఞం గైకొని ముందుగా నొనర్పవలసినరీతిఁ దలంచి ప్రతిష్ఠానపురమున కేఁగెను. పతివ్రతాశిరోరత్న మగునసూయ తమగృహమునకు వచ్చుటం గనుఁగొని సేవ్యాదేవి యర్ఘ్యపాద్యాద్యుపచారముల నామెను సత్కరించి యుచితరీతిని గౌరవించెను. అనసూయయు మిగుల సంతసించి "అమ్మా! నీవంటియుత్తమపతివ్రత నెందును జూడఁజాలము. సతికిఁ బతికంటె వేఱొకగతి లేదు. ఆపతిసేవయందప్రమత్తవగునీకును నీపతికిని క్షేమమా? తల్లీ! పడఁతికిఁ బతిసేవయే సర్వతీర్థములు గదా! మగవారు మహాతపఃక్రతువు లొనర్చియుఁ బడయఁజాలని ఫలమును వనితలు తమ పాతివ్రత్యమునఁ బొందుదురు. పతిశుశ్రూష నొనర్చు రమణికి వేఱునోములు వ్రతములు నుపోషణములు నక్కఱ లేదు. కాన నీవు నీపతిసేవయం దప్రమత్తవు కమ్ము" అని పలికెను. సేవ్య కర్ణామృతము లగునీమాట లాలించి యపరిమితానందభరితమానస యై "అమ్మా! నీవంటియుత్తమోపదేశకురాలి నిదివఱ కెఱుంగను. తల్లీ! నీ వుపదేశించిన సద్ధర్మము లమూల్యములు. ఎన్నికట్నముల నర్పించినను నీగురుఋణమును దీర్చుకొనఁజాలను. కాని నావలనఁగాని, నాపతివలనఁగాని కావలసినకార్యమును ఆజ్ఞాపింపుము. తప్పక

నెఱవేర్తు''నని పలికెను. ఆమాట విని యనసూయాదేవి సంతుష్టాంతరంగ యై "అమ్మా! ఇంద్రాది దేవతలు నాయొద్దకు వచ్చి సూర్యు నుదయింపఁజేసి లోకములను రక్షింపవలె నని వేఁడుకొనిరి. నేనాపనిఁ బూని నీదగ్గఱకుఁ జనుదెంచితిని. తల్లీ! యనుగ్రహించి లోకములను రక్షింపుము''అని పల్కెను. సేవ్యాదేవి మిగుల దిగులు లోఁది యనాలోచితముగఁ దాఁ జేయు వరప్రదానమునకుఁ బరితపించి కన్నుల నీరు నించుచు "అమ్మా! మీరే యిట్లనఁదగునే? మీ రెఱుఁగనిధర్మము కలదే? మాండవ్యునిశాపమునంజేసి సూర్యోదయ మైన వెంటనే నాపతి మరణించును. ఆయవమానమును బరితాపమును దుస్సహవేదనను వైధవ్యఖేదమును నే ననుభవింపఁగలనా? పతి పోయినపిదప నా కీలోకములవలనఁ బ్రయోజన మేమి? ఇంతకుఁబూర్వము బ్రహ్మాదు లిటకు వచ్చి నన్నిదే రీతిం గోరిరి. కాని నే నంగీకరింపలేకపోయితిని. తల్లీ! వే ఱేదేనివరంబు కోరు'' మని వేఁడెను. అనసూయయు నాలోచించి "అమ్మా! నీ కేమియు భయము లేదు. నీపతి కంత కంటె భయము లేదు. సూర్యోదయ మైనఁగదా నీపతి మరణించును. సూర్యోదయమున కనుజ్ఞ యిమ్ము. ఆపై నీపతిని బ్రతికించి యతనిని సర్వాంగసుందరునిగాఁ జేయుభారము నాయది. నాశక్తిని వినియోగించి యతనిని బ్రతికింతును. నాపై నీకు నమ్మకము చాలదా!'' యని పలికెను. సేవ్యాదేవి దుద కెట్టులో యంగీకరించి సూర్యోదయమున కాన తిచ్చెను. వెంటనే యామెమగఁడు మరణించెను. ఆమె గోలు

గోలు మని యేడ్చుచుండ ననసూయాదేవి యామె నోదార్చి తరంగిణిం దాన మాడి తనహృదయపీఠమునఁ బతిని నిల్పి ధ్యానించి "నేనే పతివ్రత నగుదునేని సేవ్యాదేవిభర్త దివ్య రూపమునఁ దిరిగి జీవించుఁగాక!" అని యనునంతలో నతఁడు సర్వాంగసుందరుఁడును నీరోగియు నగుకౌశికుఁడు నిదురనుండి మేల్కాంచినట్లు లేచెను. సేవ్యాదేవి యపరిమితానందభరిత యై యనసూయను వేనోళ్లఁ గీర్తించి సర్వదా పతిసేవ లొనర్చుచు సుఖం బుండెను.



శ్రీరామచన్ద్రాయ నమః.

# పురాణపతివ్రతలు.

---

## సుకళాదేవి.

౧

తొల్లి గంగాతరంగిణీ తీరమునఁ గల వారాణసీ మహానగరమునఁ గృకలుఁ డనువర్తకుఁడు సాధువర్తనుఁడు సంపన్నుఁడు నివసించుచుండెను. సుకళాదేవి యతనికళత్రము. ఆమెయు మగనివలెనే సాధువర్తనము కలది. అన్నివిధములం బతి కనుకూల. మహాపతివ్రత. అనసూయాదిమహాపతివ్రతల కక్కయకు రాఁదగినది. అట్టివనితామణిని భార్యనుగాఁ జేసి కొనినకృకలునియదృష్టము చెప్ప నలవియా?

కృకలుఁడు దేవబ్రాహ్మణభక్తిపరాయణుఁ డగుటచేఁ దీర్థయాత్రలయెడను దీర్థమాహాత్మ్యములయెడను విశ్వాస మతనికిఁ గలదు. ఒకపుడు తీర్థయాత్రార్థియై దేశంబులఁ ద్రిమ్మరఁ దలఁచి తనపడఁతి కావృత్తాంతమును దెలియఁబలు చెను. తా నొక్కఁడే పోవ నెంచినయతనింగూర్చి సుకళ "నాథా! మీ రొక్కరే యేఁగుదురా? నన్ను విడిచెదరా? పతిసేవకంటె సతికి గతి లేదుకదా? మీరు పోఁదలఁచినచో

నన్నుఁగూడ మీవెంటఁ దీసికొనిపొండు. సతికిఁ బతియే సర్వ తీర్థములు. పతిపాదపూజయే భగవత్పాదపూజ. పతిమాట జవదాఁటకుండుటయే భగవద్వాక్యపరిపాలనము. కావున న న్నొంటరిగ విడిచిపోవకుఁడు'' అని బతిమాలుకొనెను.

కృకలునకు సుకళయం దమితానురాగము. ఆమెశరీరము చాలమృదుల మగుటచేఁ దీర్థయాత్రల కామెను దీసికొనిపోవుట యాతని కిష్టము లేదు. ఒకచోట నివాసమా యేమి? నేఁ డున్నచోట ఱేపు నిలువ వీ లుండదుకదా? వేళకాహారమూ దుర్లభము. మనకు వలయుచోట బండ్లు దొరకునా? అట్టిచోటఁ గాలినడకనే పోవలసియుండునే! అంతటికష్టముల నీసుకళ యోర్చి యుండఁగలదా? అన్ని చోట్లకును రాజమార్గము లుండుట దుస్తరముకదా? కొండలనక, నదు లనక, ముండ్లనక, యడవు లనక, యన్నింటిని దాఁటవలెనుగదా? ఈమె యవి దాఁటఁగలుగునా? కృకలుఁ డిదియే యాలోచించెను. ఇట్టికష్టము లున్న వని చెప్పినచో, నామె మహాపతివ్రత యగుటచే వానిని లక్ష్యముచేయదు. అతని వెంటనంట సిద్ధపడును. కాన పర్తకుఁ డప్పటికిఁ గన ప్రయాణము నాపివైచి భార్యతోఁ జెప్పకుండఁగనే యొక నాఁడు రహస్యముగఁ దీర్థయాత్రార్థియై దేశాంతరమున కేఁగెను.

మగఁ డింటికి వచ్చువేళ యతిక్రమించుటచే సుకళా దేవి మిగుల దిగులొంది యతని కేమికీడు మూఁడెనో యని

శంకించుచుఁ గనిపించినవారి నెల్ల నతనివృత్తాంత మడిగెను. తుదకుఁ గృకలునిబందుగులలోఁ గొందఱు అతఁడు తీర్థయాత్రార్థి యై పోయె ననియు, నచిరకాలముననే మఱలివచ్చు ననియు, బెంగఁ జెందవల దనియు నామె నూఱార్చిరి. తన పతి తన్నట్లు వంచించినందుల కామె మిగుల దుఃఖించి "అయ్యో! నాథా! నే నేమితప్పు చేసితి నని యిట్లు విడిచితిరి? నేను మీతో వచ్చుట మీకుఁ గష్టముగఁ దోఁచెనే? కట్టా! ఈ విరహపరితాపము నెట్లు సహించుదాన!" నని ప్రలాపించుచు వలవల నేడ్చెను. ఆమెచెలికత్తె లెంత యోదార్చినను లాభము లేకపోయెను.

సుకళాదేవి పతివియోగమును భరింపఁజాలకపోయెను. విలువగలబట్టలను ధరించుట మాని యొకమలినవస్త్రమునే ధరించి యాభరణముల నన్నింటిం దీసివైచి తల దువ్వుకొనక, యన్నమును దినుట మాని, పాలో పండ్లో యాహారముగఁ గల్పించుకొని కటికినేలపై నొకవస్త్రము పఱచుకొని పండుకొనుచు నేకాంతవాస మొనర్చుచుండెను. కొలఁదిదినములకే యామెశరీరము కృశించిపోయెను. ఉత్సాహ ముడిగిపోయెను. ఆనంద మంతరించెను. తమసఖియుదంతముం గని చెలికత్తె లామె నోదార్చుచు "అమ్మా! బేలవై యిల యిట్లు విలపింతువు? అమ్మా! ధైర్యము పూనుము. మంచి వస్త్రముల ధరించి నీయాభరణములను ధరించి యుపవాసము లొనర్పక పట్టెఁడన్నము తిని కాలము గడపుము. నీ వట్లు చేసినచో నీపాతివ్రత్యమునకు భంగ మేమి కలుగును? తల్లీ!

నీపతియు వేగమ వచ్చి నిన్నుఁ గలిసికొనఁగలఁడు" అని విన్న వించిరి. సుకళ "ఏమే యిట్లు మాటాడెదరు? పతి దగ్గఱ నున్న, నదియే వనిత కలంకారము. అతఁడు పజ్జ లేనిచో నీయాభరణములు కాల్పనా? మగఁడు సమీపమున లేని యవసరమున వనిత యలంకరించుకొనునేని యావస్తువులు శవాలంకారములరీతిని కళ తఱిఁగియుండును. వనితకు, భర్త యానందించినచో సర్వదేవతలు నానందింతురు. అట్టిపతి పజ్జ లేనిచో వనిత కానందము కలుగనేర్చునే? భర్త యూర లేనపు డలంకరించుకొని యానందించుస్త్రీని లోకు లనుమా నింతురు. అట్టియామె పుంశ్చలి యనియే యందురు. కాన వనితకు సర్వదా పాతివ్రత్యమే కొనసాగవలె నన్నచో, మగని నొకప్పుడును విడిచియుండరాదు. అట్టియామెయే పతివ్రత యనిపించుకొనును. పూర్వము సుదేవ యనుమహాపతివ్రత యట్లే యొనరించి తనమగఁడు వేఁట కేఁగిన నతనితో మృగయావినోదార్థిని యై యేఁగెడిది" అని వాక్రుచ్చెను. అంత, చెలికత్తెలు "అమ్మా! యామహాత్మురాలిచరిత్రము నొక కొంత చెప్పి మాకు శ్రవణానంద మొనర్పు" మని యనవుడు. సుకళాదేవి వారి కీవృత్తాంతముం దెల్పెను.

౨

పూర్వము సూర్యవంశదీపకుఁ డగు వైవస్వత మనుపుత్త్రుఁడు కోసల దేశాధిపతి యిక్ష్వాకు వను నతఁ డయోధ్యానగరమును బరిపాలించుచుండెను. సుదేవా దేవి

యతని భార్య. ఆమె మహాపతివ్రత. ఆమె యొక్క యఱ నిముసమేనియు ధవుని విడిచియుండఁ జాలదు.

ఒకప్పు డిక్ష్వాకు మహారాజు మృగయావినోదార్థ మడవికిఁ బయన మయ్యెను. సుదేవకూడ నాతనితోడనే యుండెను. రా జడవులం దిరుగుచు ననేకము లగు క్రూర మృగములను సంహరించెను. ఎంతకు నాతనికిఁ దృప్తి కలుగ లేదు. అట్లు కొన్నిటిం జంపి యొక కాఱడవికిఁ జనియెను. ఆ యది యొక కొండదరిని గలదు. అందు సపరివారముగ సకుటుంబముగ నొక సూకరరాజు నివసించు చుండెను. అయ్యది యడవిలోఁ దిరుగుచున్నపుడు దూరమునుండియే సపరివారుఁడును మృగయావినోదియు నగు రాజుం గాంచెను. పందిఱేనిం జూచి రాజు ధనుష్టంకార మొనర్చెను. పంది యొంటరి యగుటచే, నతని నెదుర్కొనక త్వరితగతిం దన గుహం జేరి తన మంత్రులతోడను బుత్త్రులతోడను నాలోచించెను. యుద్ధమునకుఁ బోవుటయా ? లేక యీ యడవిని విడిచి పాఱిపోవుటయా ? యని యడిగెను. రాజపరివార సన్నాహములను బాగుగ గుర్తించి వచ్చిన సూకరపుత్త్రులును సూకరరాజ్ఞియు "రాజు మహాబలవంతుఁడు. మనలను సంహరించు సాధనములా యనల్పములు. కావున మన మిట నున్నచో రాజు మనలను సంహరింపక మానఁడు. యుద్ధము చేసినను మనకు నాశనమే కాని లాభము కలుగఁ జాలదు. కాన వీ లగునంత వేగముగ నీ చోటు విడిచి పాఱిపోవుటయే మంచి దని పలికిరి. మంత్రులును బాగుగ

నాలోచించి యదియే యుక్తమని విన్నవించిరి.

తమవారి హితవాక్యము లాలించి సూకరరాజు చిఱు నవ్వు నవ్వి "మీరు యుక్తియుక్తముగఁ బల్కితిరి. కాని యది నాకు హితముగ లేదు. రాజు ధనుష్టంకార మొనర్చి నన్ను రణమున కాహ్వానించెను. అట్టియెడఁ బిఱికిపందనై యీ నా రాజ్యమును వీడి పాఱిపోవుట నాటిమగంటిమి? సాటి మృగము లేమనును? అవమానము భరింప శక్యము కానిది కదా? రణమున జయించినచో మన రాజ్యము మనకు దక్కుటయు, యశము కల్గుటయుఁ జేకూడును. రణ మున మరణమే కల్గినచో వీరస్వర్గప్రాప్తి కలుగును. కాన రణమునకే సిద్ధపడుదము. మీ రందఱు నుత్సాహపూరితు లై రణ మొనర్చిన మనకు జయము కల్గుట నిక్కువ" మని పల్కెను. అందఱును తుదకు 'వల్లె' యని యంగీక రించిరి. సూకరరాజపత్నికూడ యుద్ధమునకు సిద్ధపడెను.

ఆపై నిక్ష్వాకుమహారాజునకును సూకరరాజునకును ఘోరయుద్ధము జరిగెను. చాల సూకరములు రాజపరివా రమును జాలవఱకుఁ జంపివైవ, ననేకులు వీరులు సూకరము లను జంపిరి. సూకరరాజు రెట్టించిన యుత్సాహముతో నిక్ష్వాకుపై కుఱికెను. అతఁడా దెబ్బ తప్పించుకొని తన గుఱ్ఱమునుండి యొక శకటముపై కుఱికెను. పంది గుఱ్ఱము నవలీలగఁ జంపి రాజుపైకిఁ బోయెను. ఇక్ష్వాకుమహారాజు నిశితశరపరంపరలను దానిపైఁ గురియించి తుదకు దానిం

జంపెను. తోడనే యది యొక దివ్యరూపముఁ బొంది తేజ
రిల్లు దేవతామూర్తియై మింటి కెగసిపోయెను. రాజపరివార
మంతయు మిగుల నాశ్చర్యపడెను.

తన మగఁడు మరణించుటఁ గనులారఁ గాంచిన
సూకరరాజపత్ని యిఁక నసువులపై నాస వీడి సేనపైఁ బడి
దానిం జెల్లాచెదరుగఁ జేసి కొంకఱ రాజవీరులం జంపెను.
పాపము! అందఱును ఆ యాఁడుపందిపై శరపరంపరలఁ గురి
సిరి. తోడనే యది యాయాసమున సొమ్మసిల్లి పోయెను.
దానిమైనిండ రక్తము వెల్లువయై ప్రవహింప సాగెను. పిస
పడి యిక్ష్వాకురాజు "భటులారా! ఆ యాఁడుపంది నేమి
యు హింసింపకుఁడు. స్త్రీవధ దూష్యమైనపని. కాని,
దానియొద్ద నుండక మరలి పొండు" అని యాజ్ఞాపించెను.
పిదప సుదేవాదేవి దానిం జూచి మిగుల జాలిపడి దానిదరిం
జేరి శీతలోదకముల దాని మొగమునఁ జల్లి సేదఁ దేర్చెను.
కొంతసేపటి కది పూర్తిగఁ దెలి వొంది సుదేవం జూచి
మిగుల సంతసించి మనుష్యవాక్యముగ "తల్లీ! చల్లని
నీకరస్పర్శమున నీ పాపకలుషిత దేహము పవిత్రమై పో
యెను. నీవు మహాసాధ్వివి. నీ దర్శనముననే సకలపుణ్య
ములును గలుగును. దేవీ! నీకు మంగళ మగుఁ గావుత"
మని పల్కెను. పసు వట్టు మనుష్యవాక్యమునఁ బల్కుట
కచ్చెరు వంది సుదేవ తనమగనిం జేరి "చూచితిరా? అది
మనుష్యులమాదిరిఁ బల్కుచున్న" దని విన్నవించెను. అతఁ
డును దానిం గని యాశ్చర్యపడి "దేవీ! ఈ పంది యెవతె

యో, యీ జన్మ మీమె కెట్లు కల్గినదియో, ఇంతకుఁ బూర్వము విద్యాధరరూపమున మింటి కెగసిన యీ పందితేఁడెవ్వఁడో, యతని కీ జన్మ మెట్లు కలిగినదో సవిస్తరముగఁ గనుఁగొను" మని పల్కెను. సుదేవాదేవియు నా సూకరనాయకపత్ని నీ వృత్తాంత మడిగెను. "అమ్మా! మేము పాపాత్ములము. మా చరిత్రములను వినినచోఁ బాపము కల్గుట తప్ప వేఱొండు ప్రయోజనము లేదు. కాని నీవంటిమహాసాధ్వి కోరుటచేఁ జెప్పకుండుట తప్పు. మఱియు నీవు మా పాపచరిత్రములను వినినంత మాత్రమున మా పాపములు నశించును. మా కుత్తమగతులు కల్గును. నాకుఁ బూర్వజన్మజ్ఞానము కొంతవఱకును గలదు. నా జన్మాంతరమునందలి కష్టము లాత్మవేద్యము లై, వానివలనఁ బశ్చాత్తాపము కలుగుటకై భగవంతుఁడు తద్ జ్ఞానమును నాకుఁ బ్రసాదించెను. నా దీనచరిత్రమును నీబోఁటి యుత్తమురాండ్రకు వినిపించి పాపవిముక్తిం బడయ మానుషవాక్కు నను గ్రహించెను. కాన మా దీనచరిత్రముల విన్నవించెదను. విని మమ్ము నుద్ధరింపుము తల్లీ! తొల్లి యీ వరాహరాజచరిత్రముం దెల్పెద; సావధానచిత్త వై యవధరింపుము.

3

ఉత్తరదిక్కున మేరు వనుమహానగము కలదు. సుందరము లగు గుహలును, హృదయతాపముం జల్లార్చుసెలయేళ్లును, మందమారుతముల నాట్య మాడువృక్షములును

# సుకళాదేవి.

గలయామహాగిరిని పులస్త్యమహాముని యాశ్రయించి నిర్విఘ్నముగఁ దప మాచరించుచుండెను. రమణుఁ డగురంగవిద్యాధరుఁ డనువిద్యాధరుం డొకఁడు స్వేచ్ఛగ నాగిరి కేతెంచి వేఱొండు చోటునకుఁ బోక పులస్త్యుఁ డున్న తావునకే యేతెంచి మధురమధురముగ గానము చేయఁ జొచ్చెను.

పులస్త్యుఁడు ఘోరతప మాచరించుచున్న, నాతనికర్ణపుటముల నీగానామృతము నిండెను. వెంటనే యాతనిసమాధిభగ్న మయ్యెను. అతఁడు రంగవిద్యాధరునింగూర్చి "నాయనా! నీగాన మత్యద్భుతము. దేవాదిదేవునిగూడ ముగ్ధు నొనర్చును. హృదయమును జలింపఁజేయు నీపాట నాకర్ణపుటముల సోఁకి నాతపస్సును భంగపఱచుచున్నది. కాన నీ చోటునుండి వేఱొకయెడకుం బొమ్ము" అని వేఁడుకొనెను.

విద్యాధరుఁ డింద్రునియనుఁగుబంటు. పులస్త్యుఁ డొనరించు ఘోరతపమునకు విఘ్నము లొనర్చి, దానిం బాడు సేసి రావలయు నని యింద్రునియానతి. పులస్త్యునికోరిక చొప్పున విద్యాధరుఁడు వేఱొకతావునకుఁ బోయినచో నీతని కృత్యము కొనసాగు టెట్లు? కావున విద్యాధరుఁడు "మహామునిసత్తమా! ఏమి! నాగాన మంతకష్టతరముగ నున్నదా? బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మువ్వురును గీతప్రియులు. గానమహానందదాయకము. సర్వరసవిశిష్టము. శృంగారాదిరసములకు గానమే ముఖ్యము. నాల్గువేదములును గానముపైనే

యాధారపడి యున్నవి. సర్వేష్టదాయక మగునాగీతమును మీముబోంటిమునులు నిరసించుట— నిందించుట న్యాయ మగునే?'' అని పలికెను. అంతఁ బులస్త్యుఁడు ''ఓయీ! నేను నీగానమును నిరసింపలేను. గీతము సకలానందదాయక మగుట నిక్కువము. కాని తప మాచరించువారలకు విరోధి. ఏ మందువా? గీతశ్రవణమున నానందము కల్గి యది మానవుని విషయేచ్ఛకు దింపి మనస్సు నాకర్షించి స్థైర్యమును బోఁగొట్టును. మనోనిశ్చలత లేనిచోఁ దపము కొనసాగుట దుర్ఘటము. నేను తపస్వి నగుటఁ జెప్పుచున్నాను. ఎచట శబ్దమును, రూపమును, స్త్రీజనము నుండవో యట్టిచోటే సమాధి కనుకూల మగుచోటు. కాన మన కిరువురకు సరిపడదు. కాన నీచోటనుండి వేఱొకయెడకుఁ బొమ్ము. లేదా నేనైన మఱియొకయెడ కేఁగెద'' నని వాక్రుచ్చెను. విద్యాధరుఁ డామాట విని ''మునీంద్రా! నీవు జితేంద్రియుఁడవు కాన నిట్లున్నావు. శబ్దము వినినంతమాత్రముననే ధ్యానము నుండి చలించునతఁ డేపాటితపస్వి? నాగీతము నడ్డ నెవ్వరికిని పరము కాదు. నీకుఁ గష్టముగ నున్నచో నీవే మఱియొక స్థలమునకుఁ బొమ్ము'' అని పల్కెను.

ముని యీయుత్తర మాలించి యొకింత కోపించియుఁ గర్తవ్య మాలోచించి శాంతచేతస్కుఁడై మఱియొకచోటున కేఁగి రెట్టించినసియమమునఁ దప మాచరించుచుండెను. రంగవిద్యాధరుఁడును గార్యార్థి కావున, ముని యున్నయెడ కనుఁగొని వరాహరూపముం దాల్చి యతని యాశ్రమమున కేఁగి

యతనిని ముట్టెతో ముట్టుకొనుచు నాశ్రమమున మూత్రపురీషోత్సర్జన మొనర్చుచు నతనిం జీకాకుపఱచుచుండెను. మునియు నది నిజ మగుపంది యనియే తలంచి యేమియు శిక్షింపక యూరకుండెను. ముని తన్నేమియుఁ జేయలేదని యాపంది తనయకృత్యముల నంతకంటె విరివిగ నొనర్చుచు నొకప్పుడు వికటాట్టహాసము చేయుచు, వేఱొకయప్పుడేడ్చుచు, నింకొకప్పుడు తొంటిరీతినే పాడుచు నుండెను. ఆ పాట విని ముని యాపంది తొల్లిటివిద్యాధరుండే యనియుఁ దనతపస్సును జెఱుప వచ్చెననియు గుర్తించి మిగులఁ గోపించి యాపందిరూపుననే యుండునట్లు శపించెను.

వెంటనే సూకరము గోలుగోలున నేడ్చుచుఁ దన యేలిక యగుసహస్రాక్షునియొద్దకుం జని "పురందరా! నీమానతిని గైకొనినే నేఁ బులస్త్యునితపముం జెఱుప సమకట్టితిని. తత్ఫలముగ నాకు సూకరజన్మము ప్రాప్తించినది. కావున నన్ను రక్షించి యీపాపదేహమునుండి విముక్తిం బ్రసాదింపు" మని వేఁడుకొనెను. దేవేంద్రుండును వరాహముం దోడుకొని పులస్త్యమహామునికడ కేఁగి విద్యాధరుని తప్పులను క్షమింపవలె నని వేఁడుకొనెను. పులస్త్యుఁడు "ఇంద్రా! నీ వింతగ వేఁడుచుండుటచే ననుగ్రహించితిని. ముందు సూర్యవంశమున వైవస్వతమనువున కిక్ష్వాకుమహారాజు జనించును. అతఁడు మృగయావిహారి యై వచ్చి యీవరాహమును సంహరించును. అప్పుడు దీనికిఁ బశుజన్మము నశించి దివ్యదేహభాగ్యము కలుగు" నని శాపమోక్షణము ననుగ్రహించెను.

నేఁటి కాతనికి మంచిదినములు వచ్చుటయు, మీ రీయడవికిఁ జనుదెంచుటయుఁ దటస్థించినవి. నీమనోహరుని పాదసన్నిధి నాసూకర మసువులఁ బరిత్యజించి పాపసంక్షాళన మొనరించుకొని దివ్యదేహమును బొంది రంగవిద్యాధరరూపమును ధరించి యిప్పుడే స్వర్గలోకమున కేఁగెను. ఇది యావిద్యాధరునిచరిత్రము. ఇఁకఁ బాపసంకుల మగు నాచరిత్రమును విన్నవించెద నాలింపుము.

కళింగదేశమునందుఁ జాతుర్వర్ణ్యనిషేవ్య మగుశ్రీపుర మనుమహానగర మొండు కలదు. అందు బ్రహ్మవిద్యాధురంధరుఁ డగు వసుదత్తుఁ డనుబ్రాహ్మణుఁడు నివసించుచుండును. అతనికి సహజసౌందర్యరాశి యగు సుదేవ యనుపుత్రిక యుండెను. ఆమెయందుఁ దలిదండ్రులకే కాక బందుగులందఱికి నమిత మగుప్రేమ కలదు. ఆబాల పున్నమచందురునిరీతి వింతసోయగంబున నలరారుచు, దినదినము పెరుఁగుచుండెను. ఆమెచక్కఁదనమునకు కచ్చెరువడి బంధువులలోని బ్రహ్మచారు లందఱు నామెనే వివాహ మాడవలె నని సంకల్పించి యుండిరి. అనేకపర్యాయములు కొందఱు "నీకూఁతు నాకే యీవలయు" నని వసుదత్తునే యడిగిరి. కాని యామెయం దెక్కువమక్కువ గలతండ్రి యామెతోడి వియోగమును భరింపఁ జాలక పుత్రికావివాహమునకై తొందరపడ లేదు.

ఏండ్లు గడచుచుండెను. సుదేవ శైశవావస్థను వీడి యౌవనావస్థయం దడుగిడెను. అంత వసుదత్తునిభార్య, బాలిక ననురూపుఁ డగువరున కిచ్చి పరిణయం బొనర్పకతీర దనియు, లేకున్నఁ గులములోఁ దలవంపులు తప్ప వనియుఁ బలికెను. వసుదత్తుండును బాలికకుఁ ద్వరలో వివాహ మాచరించుట యుక్త మని యెంచియుఁ, బుత్త్రికావియోగమును సహింప లేక యిల్లఱికముండునతనినే యల్లునిగా గ్రహింప సంక ల్పించి యనురూపవరుని నెమకుచుండెను.

శివశర్మ యనునొకవటుఁడు కౌశికగోత్రసముద్భూ తుఁడు. సర్వవిద్యావిశారదుఁడు. వేదవేదాంగరహస్యవేత్త. సుశీలవంతుఁడు. సుగుణఖని. సహజసౌందర్యరాశి. అతనికిఁ దలిదండ్రులు లేరు. అతఁ డాయూర విద్య నభ్యసించుచు భిక్షార్థము తిరుగుచు వసుదత్తునియింటికిఁ గూడ వచ్చెను. వసుదత్తుఁ డాతనికులగోత్రముల నడిగి తెలిసికొని, యట్టి సుగుణవంతుఁడును సౌందర్యవంతుఁడునే తనకొమరితె కను కూలుఁ డగుమగఁ డనియు, నట్టి దిక్కులేనివాఁడే యిల్లఱిక ముండు ననియు నెంచి యతనికి సుదేవ నిచ్చి పరిణయ మొన ర్చెను. అంతటినుండియు శివశర్మ యత్తవారియింటనే యతి వతోఁగూడఁ గాఁపుర ముండెను.

సుదేవ సౌందర్యవతియే కాని శీలవతి కాదు. "పాప వృత్తయేన రూప"మ్మనునుడి యీమెయెడ విపరీత మయ్యెను. తనమగనిని దండ్రి కొని తన కిచ్చె ననియు, దరిద్రుఁడగునతఁడు

గతిలేక తమప్రాపుఁ జేరె ననియు, తా ధనికునిబిడ్డ యగుటచే మగనిని లక్ష్యము సేయనక్కఱలే దనియు నామెయూహ. ధనరూపసంపదల నామెకు గర్వ మధిక మయ్యెను. ఆగర్వముననే యామె పతిశుశ్రూషను జలుపలేదు. మగనిమాటను లక్ష్యపెట్టలేదు. ఒకప్పుడు నామె ప్రేమ మీఱ నాతనితోఁ బల్కుటలేదు. కలనేని యాతనిపాదసంవాహన మొనర్పలేదు. మఱియు సర్వదా కులటలకూటమిం జేరుచు వారి వృత్తాంతముల విని వారిలోఁ గలిసి తనయిచ్ఛ వచ్చినట్లు మెలఁగఁజొచ్చెను. తా నిచ్ఛ వచ్చినరీతిఁ బోవుచుఁ దా నెక్కడి కేఁగునదియు మగనితోఁ జెప్పదు సరికదా తల్లిదండ్రులతోడ నైనఁ జెప్పదు.

శివశర్మ సాధువర్తనుఁడును శాంతస్వభావుఁడు నగుటచే భార్యనుగాని యత్తమామలనుగాని పల్లెత్తుమాట యని యెఱుఁగఁడు. సుదేవాదుశ్చరిత్ర మానగరమున మారోమ్రోఁగెను. తల్లిదండ్రులును, మగఁడు నాయవమానమును సహింపఁజాలకపోయిరి. శివశర్మ కొంతకాల మట్లునే యోర్చియుండి యాయవమానమునకుఁ దాళఁజాలక, యెవ్వరితోడ నేమియుఁ జెప్పక యానగరమును—ఆమండలమును, ఆదేశమును గూడ విడిచి యెచటికో పోయెను.

అల్లుఁడు సద్వర్తనుఁ డని యత్తమామల కతనియెడ గౌరవమును ప్రేమయుఁ గలవు. అట్టియతఁ డీయవమానమును భరింపఁ జాలక యిలు వీడిపోవుట వారికి దుస్సహ

మయ్యెను. ఒకపుడు వసుదత్తుఁడు భార్యం బిలిచి "అయ్యో! ఎంతపని జరిగెనో చూచితివా! కులట యగుసుదేవవలనఁ గల్గునవమానమును సహింపఁజాలక యల్లుఁడిలువీడిపోయెను. తన మనస్తాపము నొకపుడైన మనకుఁ దెలియచేయలేదు. తాఁబోవుచున్నపుడును దెలుపలేదు. ఎంతటి మహాత్ముఁడు! మగఁడువిడిచిన యీకులటవలన నింకను మనకుఁ దలవంపులు కలుగును. నల్గురిలో నిఁక తిరుగు టెట్లు?" అని యడుగ నామె "నాథా! మీరే సుదేవ నట్లు పాడుచేసితిరి. తొలుత నుండియు నామెయెడ మిక్కిలిమక్కువ గల్గి భయభక్తులకు నణుమాత్రమును దావీయకపోయితిరి. పసితనముననే స్వేచ్ఛను సంపాదించినయామె యిపుడు మనకు లొంగునే? మీ రామెకు ముద్దులు కఱపితిరేకాని విద్యాబుద్ధులను గఱపలేదు. ఎన్నఁడైన నది పతిని లక్ష్యముచేసెనే? అతనితో నేకాంతముగ సంభాషించెనే? ప్రేమమీఱ నొకపలుకైనఁ బల్కెనే? అతఁడు మహాసాధువుకాన నూరకుండెనుగాని మఱియొకఁడైన నట్లు సేయునే? ప్రేమ చూపుచున్నచో సుగుణములు కలుగనేరవు కదా!

తమసంతానమును, దానిబాగు కోరువాఁడు పొగడక నిందించుచుఁ గాఠిన్యము వహింపవలెను. శిక్షణము లేకున్నచో శిష్యునకును విద్య రాదు. అట్టిశిక్షణము లేక సుదేవ మన కిప్పు డిట్టియపకీర్తిం గల్గించినది. ఈ యవమానమును మనము భరింపఁగలమా? కులగౌరవముకంటె నాత్మసుఖ మెక్కువ కాదుకదా! ఇట్టి కులట మనయింట నున్నచో

మన వంశమర్యాద యంతయు గంగలోఁ గలియును. ఇన్ని దినములును దీని ప్రవృత్తిని మన మెఱింగి యున్నను మగఁడిటనే యుండుటచేఁ గొంచెమువఱకును సహింప వీలయ్యెడిది. ఇఁక సహింప శక్యము కాదు. కులగౌరవముకంటెఁ బుత్త్రిక యెక్కువ కాదు. ఈమెను మనము మనయింటినుండి తఱిమివైచినచో, మనలను మనవంశమును లోకులు గౌరవింతురు. కాన నీమె నింటినుండి గెంటివేయుటగా యుత్తమము. మీరు పుత్త్రికావాత్సల్యమును మాత్ర మిసుమంతయును జూపరాదు సుఁడీ! తొల్లి సత్యకేతువు తన పుత్త్రికయగు పద్మావతి నేమి చేసినాఁడు? వెంటనే తమ యింటినుంటి పంపివేయ లేదా? ఆయుదంతమును జెప్పెదను. సావధానముగ వినుఁడు.

౫

మాధుర దేశచూడాయిత మగు మధురా నగరమును యాదవ వంశ దీపకుఁ డగు నుగ్రసేనుఁ డనురాజు పరిపాలించుచుండెను. అతఁడు సకలసుగుణోపేతుఁడు. మహాతేజస్వి, మహాబలుఁడు. అతఁడు ప్రజలను న్యాయ్యముగఁ బరిపాలించుచుండెను.

విదర్భదేశాధీశుఁ డగు సత్యకేతువునకుఁ బద్మావతి కూఁతురు. ఆమె మిగుల సందకత్తె, సుశీల. ఆమె సద్గుణోపేత యై రెండవ లక్ష్మివలె విరాజిల్లుచుండెను. ఉగ్రసేనమహారాజా పద్మావతిని బరిణయ మాడెను. వారిరువురు

నొండొరుల నత్యంతముగఁ బ్రేమించుకొనుచు సకలసుఖము లను బొందుచు నానందించుచుండిరి. పద్మావతి సర్వదా పతిని సేవించుచు నతనిచిత్తవృత్తి ననుసరించి మెలంగుచు పతివ్రతామతల్లులలో నీమెయు నొక్కరిత యనుపేరు గడించెను.

పద్మావతిపై మగనికివలెనే తలిదండ్రులకుఁ గూడ నమిత మగు ప్రేమ కలదు. కావున సర్వదా పుత్త్రిక నెడఁ బాసియుండుట వారికిని దుర్భరముగ నుండెను. కావునఁ గొంద ఱు సేవకులం బంపి "ఒకసారి చూచుటకుఁ దమ పుత్త్రికను బంపవలె" నని యుగ్రసేనమహారాజునకుఁ గబు రంపిరి. ఉగ్రసేనుఁ డాసేవకుల నుచితరీతిని గౌరవించి యత్తమామల సేమంబు లడిగి తెలిసికొని వారి విన్నప మాలించెను. పిదప నావృత్తాంతమును రాణి కెఱిఁగించి, తన సకియఁ బంపుట కంగీకరించి మాతులునియానతిని శిరసా వహించెను.

పద్మావతియు మెండగుసంతోషమునఁ బుట్టినింటి కేఁగి తల్లిదండ్రుల యడుగుఁ దమ్ములపై వ్రాలి వారి దీవెన లందుకొని తన యనుంగుచెలిమికత్తెల నాబ తీఱ నాలింగ నము చేసికొని యానందవార్ధి నోలలాడెను. పద్మావతి తల్లి యొసంగు ననేకామూల్యవస్త్రాలంకారములను ధరించి చెలి కత్తెలతో సవిలాసంబుగఁ దిరుగుచుండెను.

ఒకనాఁ డామె తన చెలిమికత్తెలతోఁ గూడఁ దండ్రి గారి యుద్యానవనమునకు విహారార్థ మేఁగెను. ఆవనము

చంపకపున్నాగమందారాది పుష్పవృక్షములతోడను మాలతీకుందాది సౌరభపుష్పవల్లికలు గలకుంజములతోడను కమలకోకనదాదిలతావిలసితము లగుసరోవరములతోడను కన్నులకు విం దొనగూర్చుచుండును. ఇంతియ కాక యావన మీాపమున నొక క్రీడాపర్వతము కలదు. దానియంద మింతింత యని చెప్ప నలవి కాదు. పద్మావతీదేవి యావన తలంబునఁ దిరుగుచు శుకపికశారికాదివిహంగసంతానరవంబులకును గానములకును మిగుల నలరి యానందమున ము నింగియుండెను.

అందకత్తె యగునామందగమన తన చెలికత్తెలతోఁ గూడి నిస్సంశయముగ, నిర్భయముగ వనవిహారమును సల్పుచుండుట వైశ్రవణుని భృత్యుఁడును క్రూరకర్మదక్షుఁడు నగు గోభిలుఁ డనురాక్షసుఁ డాకసమున విమానారూఢుఁడై యేఁగుచుఁ గన్నారఁ గాంచెను. కాంచి యామెపై మోహమును నిల్పి యామె సత్యకేతువుపుత్త్రిక యనియు, నుగ్రసేనునిపడఁతి యనియుఁ, దండ్రిం జూడఁ బుట్టినింటికేతెంచె ననియుఁ దన దివ్యజ్ఞానమున నెఱింగి "ఆహా! ఏమి యీామెసౌందర్యము! మూఢుఁ డగు నుగ్రసేనుఁ డిట్టిమిటారిని విడిచి యె ట్లుండఁగలిగెను? అయ్యో! నా మనం బీమెయందు లగ్నమై యున్నదే! ఈమెం బొందని జన్మ మేమిజన్మము? ఈమె దక్కకున్నచో నా జీవితము నిలువఁజాలదు! పతివ్రత యగునీమె న న్నెట్లు పొందును? అయినను బ్రయత్నించి మాయచేసి యె ట్లయిన నీమెతోడి

సౌఖ్యము ననుభవించెదఁ గాక!" అని చింతించి కొంత వఱ కాలోచించి, కామరూపి యగుటచేత నుగ్రసేనునిరీతిగా మాఱి యచటఁ గల క్రీడాపర్వతముపై నా వనితాలోక మునకుఁ గనిపించునంత దూరముగఁ గూరుచుండి యొక వీణియం గరమునఁ గీలించి తంత్రుల మీటుచు మధుర మధురముగ గానము చేయుచుండెను.

సరోవరముచెంత సరసము లాడుకొనుచెలిమికత్తె లాపాట నాలకించి తమలోఁ దాము "చూచితిరే! ఆపర్వత మున నశోకవృక్షచ్ఛాయఁ గల చలువఱాతిపై నాసీనుఁడై యున్న యా నవమోహనాంగుని? అతఁడు తనగానామృత స్రావమున మోడుమ్రాఁకులనుగూడఁ జిగురు లెత్తించు నవ వసంతమే" అని యనుకొనిరి. పరపురుషుని జూడ నిచ్చగిం పని పరమపతివ్రత యగు పద్మావతిసయితమా వేడుకం జూడఁదలఁచి యొకపరి నాదెసఁ దిలకించెను. తోడనే యామె యతఁడు తనప్రాణనాథుఁడే యని తలఁచి "అయ్యో! ఏ మిది? నామనోనాథుఁ డగుమహారాజు నావిరహవేదనకుఁ దాళఁజాలక రాజ్యమును విడిచి యిట్లరుదెంచెను? కట్టా! ఎంతపని పుట్టెను?" అని విచారించెను. గోభిలుండును "సఖీ! పద్మావతీ! యిటు ర" మ్మని పిలువసాగెను. పద్మా వతి కొక్కపెట్టున సంతాప భయ లజ్జలు కలిగెను. అతని దరి కేఁగకుండుట పాడియా? పతివ్రతకుఁ బతివాక్యమును దిరస్కరింపఁదగునా? తా నతనిదరి కేఁగకయున్నచో నతఁడు కోపించునేమో?

గోభిలుఁడు మఱలమఱల "ప్రాణసఖి! పద్మావతీ! యిన్ని దినములును నీవియోగమును సహించియుంటిని. కాని యిఁక సహింపఁజాలను. నీవు లేనిచో నాయీజీవము నిలుచుట కల్ల. కావుననే ప్రాణపద మగురాజ్యమునుగూడ విడిచి వచ్చితిని. నీవు వచ్చి యీదీనుని బాలింపుము" అని పిలిచెను. ఆమెయును జేయునది లేక యతనిదరి కేఁగెను. అతఁడు నామెను గాఢముగఁ గౌఁగిలించి మంచిమాట లాడి సంకేతస్థానమునకుఁ దీసికొనిపోయి యామెతో సుఖమున నోలలాడెను.

అపుడు పద్మావతీదేవి తనమగనిభుజమునఁ గలపుట్టుమచ్చ యతనిభుజమున లేకుండుటఁ జూచి నిశ్చేష్టయై మోసము జరిగె నని తెలిసికొని వలవల విలపించుచు "ఓరి! దుర్మార్గుఁడా! నీ వెవ్వఁడవురా? పరమపతివ్రతనగునన్నుఁ జెఱచి నాయుసుఱు పోసికొంటివి? ఓరి! గోముఖవ్యాఘ్రమా! నామగనివేషము వేసికొని వచ్చి నన్ను వంచించితి వేలరా? నీవు కఠినరాక్షసునికంటె నధముఁడవుగ నున్నావు. చూడుము. ఘోరశాప మొసంగి ని న్నేమి చేసెదనో చూడుము" అని మిక్కిలి క్రోధమూర్తిని యై పలికెను. అంత గోభిలుఁడు "అమ్మాయీ! యొకింత తాళుము. నన్ను శపింపవచ్చును గాని న న్నేల శపింతువో కారణము ముందు చెప్పి యాపై నీయిచ్ఛ వచ్చిన ట్లొనర్పుము. నేను వైశ్రవణునిభృత్యుఁడ నగు గోభిలుఁ డనురాక్షసుఁడను. పరవిత్తాపహరణము, పరదారాపహరణము, బ్రాహ్మణహింసనము మొదలగునవి మా

కులాచారములు. తద్ధర్మానుకూలముగ నేఁ బ్రవర్తించితిని. ఇందు నాదోస మేమి? చూడుము. రాక్షసవిధి యొకటి ధర్మశాస్త్రసిద్ధము. తద్విధి ననుసరించి నే నిన్నుఁ గూడితిని. ఇందు నాదోసము లేదే?" యని పలుక, నామె "ఓరి! క్రూరరాక్షసాధమా! నామగనిరూపు ధరించి నన్ను వంచించి నాపాతివ్రత్యమును భంగపఱచి గంగలోఁ గలిపితివి. ఇట్టి నీవు పాపివి కావా! శాపయోగ్యుఁడవు కావా?" యని పలికెను. గోభిలుఁడు "అమ్మాయీ! మాటిమాటికిని నీ వేమో మహాపతివ్రతనని పలుకుచున్నావు. నీవు నిజమగు పతివ్రతవే కావు. పతివ్రతలదరి కేఁగుటకు మాకు శక్తి చాలదు. మేము వారిం జెఱుప నే చెఱుపము. నీవు నిజమగుపతివ్రతవే యగుచో నీమగని నెఱుఁగవా? అతనికిని నాకును జాలవ్యత్యాస ముండు నే? సుకన్య యేమి చేసినది? ముువ్వురిలోఁగూడఁ దనపాతివ్రత్యమహిమమునఁ దనమగనిని గుర్తెఱుఁగ లేదా? కాన నీవు పతివ్రతవు కావు.

పతివ్రత యనిన నెవ్వతె? అఱనిముసమేని పతిని వీడి యుండక సర్వదా యతనిశుశ్రూష నొనర్చునది. అతఁడు లేనిచో జీవితము వ్యర్థ మని తలంచునది. పతి పుట్టినింటి కేఁగు మని పల్కినను, అతనితోఁ గాక తా నొక ర్తయుఁ బోకుండునది. పతి తనదరిని లేనపుడు మధురాహారగంధ మాల్యామూల్యవస్త్రాభరణములను ధరింపనిది. నిర్భీతిగఁ జెలులతో వనవిహారము సల్పి యానందింప కుండునది. మగఁడు దరిని లేనిచో నానందలేశము నాననమం దెనసు

దాండవింపఁజేయనిది. పతితోడిశయ్యఁ గాక వేఱుశయ్యం బండుకొననిది. ఇన్నివిధములఁ గలవనితయే పతివ్రత. ఇం దొక్కగుణమేని నీయందుఁ గలదా ? లేనిచో నీవు పతివ్రత వగు టెట్లు ? నిజ మగుపతివ్రత యెప్పుడును దాను పతివ్రత నని చెప్పుకొననే చెప్పికొనదు. నీమాటలే భీకరములు కాని క్రియ శూన్యమే. నీకును గులటకును భేద మేమి? ఆమెపగిది నీవును మగనిని విడిచితివి. అతఁడు లేనపుడుకూడ నానందించు చుంటివి. ఇట్టినీవు శపింపుము. అందు సామర్థ్యము లేదు. నీశాపము నాకుఁ దగులనేరదు. ఇఁక విచారించినఁ బ్రయోజనము లేదు. సర్వలోకభయంకరుఁడును, సర్వజనకంటకుఁడు నగు సుపుత్త్రుఁడు నీకుఁ గల్గువాఁ" డని పల్కి గోభిలుఁడు యథేచ్ఛం జనియెను.

అంత నీదారుణకృత్యమున కామె మిగుల విలపించెను. ఆమెరోదనమును విని చెలికత్తె లటకు వచ్చి వృత్తాంతము నెఱిఁగి మిగుల విచారించి యావృత్తాంతము నామెతలిదండ్రులకు విన్నవించిరి. వెంటనే వా రామెను దమయింట నుంచుకొననొల్లక దోషమునుమాత్రమువ్యక్తపఱుపక యుగ్రసేనునికిపాలికిఁ బంపివైచిరి. అతఁడును తనవనితను దొంటి యట్ల గౌరవించుచు సుఖంబు లనుభవించుచుండెను. పద్మావతి యెన్నిమందులు ద్రావినను లాభము లేకపోయెను. తుదకు గర్భము పెరిఁగి లోకకంటకుఁ డగు కంసుఁ డామెకుదయించెను. మనమును బద్మావతిని దలిదండ్రులు పంపివైచినట్లే సుదేవను బంపివైచెదము. ఆమె భర్తపాలికిఁ

బోనిండు. 'తనయిచ్చవచ్చినట్లు మెలఁగనిండు. మనకు మాత్రము నిందలు తప్ప" అని మగనితో వాక్రుచ్చెను. అతఁడు నదియే మంచిపని యని తలఁచి యట్లే యొన రించెను.

౬

సకలసంపదలతో సౌఖ్యము ననుభవించుచు దేవ కిప్పుడు దిక్కు లేకపోయెను. తన్నుఁ గన్నతలిదండ్రులే దయ మాలి విడిచిపెట్టుటచే నామెకు మిగులదుఃఖమును బరితాప మును గలిగెను. ఆమె దేశదేశంబులను దిరుగుచు భిక్షు రాలై పొట్టు నింపుకొనుచు నొకచింపిరిగుడ్డ కట్టుకొని కాలము వెళ్లఁబుచ్చుచుండెను. కాని యింకను బూర్తి యగుపశ్చా తాప మామెకుఁ గలుగలేదు.

బ్రాహ్మణపుత్త్రి యగుసు దేవ నీచాతినీచముగఁ బ్రవ ర్తించుచు నూరూరఁ దిరిగి తుదకు ఘూర్జర దేశమునఁ గల వన స్థల మనునగరముం జేరెను. ఆయూర నెవ్వరు నామెకుఁ బిడి కెఁడుబిచ్చము నయిన నీయలేదు. ఆమె యాఁకట మిగుల బాధనొంది యొకమహాసౌధముదగ్గఱ నిల్చి "అమ్మా! ఆఁకలి దహించుచున్నది. చచ్చిపోవుచున్నాను. పట్టెఁడన్నము పెట్టు ము తల్లీ!" అని దీనముగ నఱచెను. అంత నొకసుందరీ లలామ సగౌరవముగ నామెను లోనికిఁ దోడ్కొనిపోయి మృష్టాన్నము పెట్టి సంతృప్తి నొందించెను. పిదప నామె సు దేవం గూర్చి "అమ్మా! నీ వెవ్వతెవు? నీయూ రేది? నీ వి

ట్లొంటరిగ నేల వచ్చితివి?" అని యడిగెను. సుదేవ యేమి యుఁ బల్కక మిన్నకున్నంతలో, గదినుండి శివశర్మ వచ్చి "ప్రేయసీ! మంగళా! ఆమె నామొదటభార్య, సుదేవ. నే నామెతోఁ జెప్పకుండఁగనే వచ్చితిని. నాఁటినుండియు నా వియోగమునకుఁ దాళఁజాలక కృశించి వికృతరూపిణి యై నాకై దేశములు తిరుగుచు, వేఱొకయెడ భుజింప నొల్లక నాయి ల్లిది యని యెఱిఁగియే వచ్చె"నని పలికెను. సుదేవ తనమగనియి ల్లిది యని యెఱిఁగి యతనివై పొకసారిచూచి తల వంచుకొని వలవల విలపింపసాగెను. మగనిసమాధాన మును సవతి చేసినయాదరణము నామెను బూర్ణ మగు పశ్చా త్తాపమున ముంచెను. ఆమె మిగుల విలపించుచు మగనిపా దములపైఁ బడెను. అతఁ డామె నోదార్చి లేవఁదీసెను. సవతి యగు మంగళాదేవి "అక్కా! ఏల విలపించెదవు? విధిప్రే రితమును దప్పింప నెవ్వరికి సాధ్యమమ్మా! ఇఁక నీకష్టములు గట్టెక్కినవి. నిన్ను నేను మిగులగౌరవముగఁ బూజించుచుం డును. నీయొక్కయు, మగనియొక్కయు శుశ్రూషయే నాకు ముక్తిదాయకము. కావున విలపింపకు"మని యామె నాశ్వా సించి యభ్యంగనాదిపరిచర్య లొనర్చి యమూల్యవస్త్రాలం కారములు ధరింప నిచ్చి వివిధముల గౌరవించుచుండెను.

సుదేవ దినదినమును దనసవతి మగని కొనర్చుపరిచ ర్యలం గాంచుచు "ఆహా! ఏమి యీపుణ్యవతియదృష్టము! ఒకప్పుడైన నే నిట్లు పతిసేవ నొనర్చి యానందింపఁగల్గితినా? అయ్యో! నాపాపమునకుఁ బ్రాయశ్చిత్తము లేదు. పరలోక

మున నేననుభవింప వలసిన యమయాతనలు లెక్కలేని వని యనుకొందును. ఆహా! నాపతి యెంతటి యుదారుడు? అట్టి యనర్ఘరత్నమును గాలఁ దన్నితినే!'' అని మిగుల విలపించెను. అప్పటినుండియు నామె కైహికము లగునాశలు నశించినవి. ఆమెపరితాపమున కవధి లేకుండెను. ఇట్లుండి యుండి యామె యొకనాఁడామనోవ్యథవలననే గుండె ప్రీలి మరణించెను. అమ్మా! ఇఁక దాఁపనేల? ఆసుదేవను ఆకులకళంకను భయంకరస్వరూపిణిని ఆమహాపాతకురాలను నేనే. తల్లీ! నాకెన్నఁటి కయినఁ బాపశాంతి లభింపఁగలదా?

యమలోకమున నేననుభవించినబాధలు వర్ణింపఁ దరములు కావు. యమధర్మరాజు చాలకాలము నన్ను శిక్షించి శిక్షించి విడిచెను. అంతటినుండి క్షుద్రమృగముల జన్మముల నెత్తుచు నేఁటి కీవరాహరూపమున నున్నాను. తల్లీ! నీకరమున స్పృశింపఁబడుటచే నాపాపములు కొన్ని నశించినవి. నాకుఁ బూర్వజ్ఞానము లభించినది. ఇఁక నా కీజన్మపరంపర నుండి ముక్తియే యభిలషణీయము. నీవే నన్ను రక్షింపవలెను. నీవు తప్పకొనినచో నే నెన్నివేలయేండ్లైన నిట్లు లుండ వలసినదే! కాన మహాపతివ్రతవగు నీవు నాయం దనుగ్రహముంచి నీవు సంపాదించుపుణ్యములో నొకదినముపున్నెమును నా కిచ్చినచో నా కీపాపజన్మనివృత్తి కల్గి దివ్యత్వము లభించును.'' అని యాయాఁడుపంది తన వృత్తాంతమును దెల్పెను. అంత సుదేవాదేవి మగనియనుజ్ఞం గైకొని తనపుణ్యమునం దొకరోజున కగుపుణ్యము నాపంది కీయ, నది వెంటనే యా

శూద్రజన్మమును విడిచి దివ్యశరీరమును బొంది యిక్ష్వాకు మహారాజునొద్దను సుదేవాదేవియొద్దను సెలవు గైకొని దివ్యలోకమునకుఁ బోయెను. రాజు సపరివారముగఁ దననగరమునకుఁ బోయెను. చూచితిరా! మహాపతివ్రత యగు సుదేవాదేవి యొకనిముసమేని మగని నెడఁబాయక యతనికిఁ గుడిభుజమై వర్తించి తనపాతివ్రత్యప్రభావమున మహాపాపిని యగుసుదేవంగూడ జన్మపరంపరలనుండివిముక్తినొందించెను.

సుకళాదేవి యిట్లు మహాపతివ్రతయగు సుదేవవృత్తాంతముం దెల్పి మఱియు సకియలతో "చెలులారా! పతివ్రత యాచరించునుత్తమధర్మములు మీ రెఱింగితి కదా! మగఁడు లేనపుడు సుఖముగ నుండు టెట్లు? అతఁడు దరిని లేకున్నచో నమూల్యవస్త్రాలంకారముల ధరించి యానందించు టెట్లు? అట్లానందించుటవలననేకదా పద్మావతి యపవిత్రయై నిశాచరాధమునకు లొంగిపోయినది! కాన మీరు నా కిట్టియెడ నుత్సాహము కల్గుమాటలు చెప్పకుఁడు" అని వారివి మందలించెను.

సుకళాదేవి మహాపతివ్రత యనునంశమును లోకము మిగులఁ గొనియాడుచుండెను. స్వర్గలోకమునఁగూడ నీయుదంతము ప్రాఁకి యచటిదేవతలను మిగుల నాశ్చర్యనిమగ్నలను జేసెను. దేవేంద్రుఁ డప్పలుకు లాలించి "ఏమి? మానుషస్త్రీ యంతపతివ్రతయా! ఎట్లయిన నామెను లోఁబఱు

చుకొని వ్రతభంగ మొనర్చెదంగాక!" యని సంకల్పించు కొని మన్మథుని స్మరించెను. స్మరించినంత మాత్రమున సతీ సమేతుం డగు స్మరుఁడు శక్రునియెదుట సాక్షాత్కరించి తనపని యే మని యడిగెను. "మదనా! భూలోకమున సుకళ యను నొకయువిద మహాపతివ్రత కలదు. కాన నామెశక్తిని బరీక్షించి వ్రతభంగ మొనర్పఁ దలంపు కలదు. ఆమెయందు మనసు నిల్పికాని మఱియొక కారణమునఁగాని నే నిట్లు పల్కుచుండు టలేదు. ఎట్లయినఁ బాతివ్రత్యభంగ మొనర్చుటయే నాసం కల్పము. నే నొకరూపవంతుఁడును, ధనవంతుఁడును, విలాస వంతుఁడు నగుపురుషుఁడ నయ్యెదను. నీవు సుకళయందుఁ బ్రవేశించి యామెను వశపఱచుకొని నాయం దనురాగము కల్గున ట్లొనరింపుము." అని యింద్రుఁడు పల్క, మదనుఁడు "ఇంద్రా! ఇది యెంతటిపని? దేవతలనే నాయిచ్చ వచ్చి నట్లు లొంగఁదీసికొందును. అట్టియెడ నొక్కమానుషస్త్రీ నా కేమిలెక్క?" యని ప్రతిజ్ఞ పల్కి యింద్రునియొద్ద సెల వు తీసికొని సుకళయందుఁ బ్రవేశించెను.

ఇంద్రుఁడును గాశీనగరమున నొకరూపవిలాసవంతుఁ డగుధనికుఁడుగా మాఱి మాటిమాటికిని సుకళ యున్నగృహ మువైపునకే యేఁగుచు, నామెపై వలపుఁ గుల్కుచూడ్కులఁ బ్రసరించుచుఁ దనమనోగతమును తెలియఁబఱచు చుండెను. కాని యామె యితనివంకనైనఁ గనలేదు. పదపడి సుకళ యేయేచోటున కేఁగునో యింద్రుఁడుకూడ నాయాచోటు నకుఁ జనుచుండెడివాఁడు. ఆమె తాన మాడుతీర్థమునొద్ద

నితఁడు. ఆమె త్రొక్కులిడుజేజేలదరి నీతఁడు. ఆమె నడచు మార్గమునడుమ నీతఁడు. ఇట్లింద్రుఁ డెన్నిపర్యాయములు తారసిల్లి భావగర్భితము లగుచూడ్కు లామెపై వెదఁజల్లు చున్న నామె యీతని నొకపరియుఁ గాంచకుండెను.

ఇంద్రుఁడు తా నట్లు ప్రయత్నించుచుఁ దనదూతిక నొకదానిని సుకళపాలికిఁ బంపి కార్యము సాధింప నెంచెను. ఇంద్రదూతియు సుకళయొద్ద కేఁగి యామెవృత్తాంతమును సాంతముగా విని, సుకళ యడుగఁ దనవృత్తాంతము "అమ్మా! నే నొకకార్యమును గోరి నీదరి కరుదెంచితిని. వినుము. నీ మగఁడు నిర్దయుఁడై యనురాగవతి వగుని న్నొంటరిగ విడిచి తీర్థయాత్రలవిషయమైఁ బోయెను. అతఁ డేదేశమున కేఁగెనో, యెం దుండెనో, జీవించియున్నాఁడో, లేఁడోకూడ నీకుఁ దెలి యదు. నీయం దనురాగము లేక నిన్ను విడిచిపోయినపతి పై నే నీయాశలను నిల్పి యతనికై కృశించి జీవచ్ఛవమ వగు నీవంటివెఱ్ఱివారు లోకమున నుండరు. నీవు యౌవనవతివి. ఇయ్యది సుఖానుభవములకు మంచియదను. నీవో, ఆయవ కాశములను బాడుచేసికొనుచున్నావు. ఈతారుణ్యము శాశ్వ తముగ నుండిపోవునది కాదు. కొలఁదివత్సరములలో నే ముదిమి కలుగఁగలదు. కావునఁ గాలమును నిష్కారణముగా వ్యయము చేయకుము. నీమగఁడు పోయినఁబోనిమ్ము. అంతకంటె నిక్కలి సౌందర్యరాశి యగునొకమహామహుఁ డున్నాఁడు. అతఁడు దినదినమును నీకై తల్లడిల్లుచు భావగర్భితము లగునపాంగ ములను నీపైఁ గురియించుచున్నను, నీవించుకేనియు నాతని

సరకుసేయక, ఆతనివైపొకసారి యైనను గాంచక, ఆతనిని లక్ష్యముచేయకున్నావు. నాయీహితము నాలించి నీవంగీకరింతువేని మూఁడునిముసములలోఁ గార్యసిద్ధిం జేకూర్పఁగలను. కావున బాగుగ నాలోచించుకొని తప్పక యనుమతింపు'' మని దీర్ఘోపన్యాసము నొసంగెను.

సుకళాదేవి యాపల్కులు విని పెదవి విఱిచి ''అమ్మా! నీవేనో మంచి నొనగూర్చుదానివలె నీయభీష్ట మేదో నెఱవేఱుటకై చాలవఱకుఁ జెప్పితివి. కాని యందణుమాత్రమునైనను నే విన సహింపఁజాలకపోయితిని. అమ్మా! యౌవనమనియు, వార్ధక్యమనియు నీవో రెండుభేదములను దెల్పితివి. కాని యవి నశ్వరమగుశరీరధర్మములు కాని యాత్మధర్మములు కానేరవు. రక్తమాంసపురీషమూత్రాదిపాత్ర మగు నీగాత్రము ప్రధానమైనదో, లేక ధర్మాచరణరక్షణమై జ్ఞానప్రద మైనయాత్మ ముఖ్య మైనదో నీవే యాలోచింపుము. నీవు యౌవనము సుఖసాధన మంటివి. అది కేవలముతప్పు. అది సుఖాభాసము కాని సుఖము కానేరదు. ఉత్తములకు విధ్యుక్తధర్మాచరణమువలననే సుఖము కల్గును. సతికిఁ బతియే దైవము. అతనిసుఖమే యామెసుఖము. కావున నీ వింక నిట్టిమాటలు పల్కి నాహృదయమును నొప్పింపవని నమ్ముచున్నాను. ఇపుడు నా కేమియు లోపము లేదు. నాహృదయేశ్వరుని రూపమును నామనఃఫలకమునఁ జిత్రించుకొని హృదయకుసుమములతోఁ బూజించుకొనుచు నానందించు

చున్ననా కింకను గావలసిన దే మున్నది ?'' అని దూతిని జీవాట్లుపెట్టి పంపించెను.

ఇంద్రుఁ డీసంగతి నంతటిని దెలిసికొని, తనప్రయత్నము లన్నియును నొకగడ్డిపోఁచకుంగూడఁ బనికిరాని వని నిశ్చయించి పరమపతివ్రత యగుసుకళను జెఱచుట కలలోని వార్త యని తలంచియు మన్మథునిం బిలిచి "ఓయిమన్మథా! మాప్రయత్నము లన్నియు నిష్ఫలము లైనవి. ఆమె నాదూతిని దల వాఁచిపోవునట్లు చీవాట్లుపెట్టి పంపివైచినది. నీ వేమో మహాప్రతాపవంతుఁడ వని యనుకొంటిని. కాని యింతటి చేతఁగానివాఁడ వని యెఱుఁగకపోతిని. పతివ్రతల యెడ నీయాట లెంతమాత్రమును సాగనేరవు. అత్రిభార్య యగు ననసూయను నీ వేమి చేయఁగలిగితివి? నేఁటితోఁగూడ నీపస తెలిసిపోయినది. ఇఁక నీతోఁ బ్రయోజనము లేదు. నే నిదే నాప్రయత్నమునుండి విరమించుచున్నాను.'' అని మిక్కిలి నిష్ఠురముగఁ బల్కెను.

ఆపల్కు లాలించినయంతనే మదనునకు రోషము నుత్సాహమును బెచ్చుపెరిఁగినవి. అతఁడు "ఇంద్రా! ఏమంటివి? మన్మథుఁ డంతటిచేతకానివాఁ డనియా నీతలంపు? నాశక్తి నీవెఱుఁగనిదా? నీ కహల్య యెట్లు దక్కెను? విశ్వామిత్రునితపోభంగ మెట్లు జరిగెను? ఆసంగతిని మఱచితివా? అట్టివారికే దిక్కు లేనపు డీక్షుద్రమానుషస్త్రీ నాకు లెక్కలోనిదా? ఇదిగో! నాప్రతిజ్ఞను వినుము. నే నిదే యీామెను లోఁబఱచుకొందును. నీవును నీప్రయత్నములలోనుండి తప్పక

ఈమెను లోఁబఱచుకొని వ్రతభంగ మొనర్పుము. ఈ మాఱు నామాట జరుగదేని యీపై నన్ను పేరు పెట్టి పిలువకు" మని దృఢప్రతిజ్ఞ నొనర్చి, తనకార్యసాధనమునకై యొక క్రీడాదూతిని సృజించి సుకళపాలికిం బంపెను.

౮

మన్మథుఁ డిట్లు ప్రతిజ్ఞచేసి తనకార్యమును సాధించు ప్రయత్నములలో మునిఁగియుండెను. అంత నీసంగతి నంతటిని జనుచున్న సత్యము ధర్మమునొద్దకుఁ బోయి "ధర్మమా! చూచితివా ఈకామముయొక్క కండకావరము? నీకొఱకు నేను సుకళాప్రియుఁ డగుకృకలుని దేశములంటఁ బంపితిని. అంత మనకు గర్భశత్రు వగునీకామము నన్నుఁ జెఱుప నెట్లు సంకల్పించుకొనినదో చూడుము. సుకళ యీ కామమునకు లొంగిపోవవచ్చునే! మహర్షులును, మహాసాధ్వులును గూడ లొంగిపోయినపుడు పాప మీమెమాత్ర మెంతకాల మి ట్లుండఁగలదు? కాన నీవు దయ యుంచి యె ట్లయిన దీనిమకము నడంపుము. దీనిని నాశనముచేయుము. లేకున్నచో నాకుఁ దప్పక నాశము కలుగును. కామము చాలనిక్ష్యయము. మంచిచెడ్డలతో దానికిఁ బనిలేదు. కాన దానియాటలు సాగకుండ నొనర్పుము" అని తెలియఁజేసెను. ధర్మముకూడఁ జాలబాగుగ నాలోచించి "సత్యమా! నీవు పలికినది బాగుగ నున్నది. ఈకామము నెట్లయినఁ దుదముట్టింపవలెను. నే నిదె ప్రజ్ఞను సుకళయెడకుఁ బంపెదను. ప్రజ్ఞ శకునమును దెల్పు

పక్షిరూపమును దాల్చి సుకళ కామెభర్త యరుదెంచుచున్న శకునమును దెల్పును. ఆమెయుఁ దనమగఁడు వచ్చుచున్నాఁడని తెలిసికొని చెడుదారిం బడక సత్యమును బాలించుకొనఁగలదు. కాన నీ విఁక విచారింపకుము " అని పల్కి దానిని వీడ్కొల్పి ప్రజ్ఞను సుకళాగృహమునకుఁ బంప, నది పక్షిరూపముం దాల్చి కృకలుఁడు వచ్చుచున్నవార్తను సుకళకు శకునరూపమునఁ దెలియజేసెను. ఆ శకునముం గని సుకళ పరమానందభరితహృదయారవింద యై మగనికొఱకెదురుచూచుచు దినములను గడపుచుండెను.

మదనునిచేఁ బంపబడిన క్రీడాదూతియు సుకళం జేరి యామెవృత్తాంతము నంతయుఁ దెలిసికొని యామెవ్రతమునకు మిగుల నచ్చెరు వొంది " అమ్మా! నీవృత్తాంతము కడుంగడు జాలిఁ గొల్పునదిగ నున్నది. నీ భర్త నిర్దయుఁడై నిన్ను విడిచి దేశాంతరముల పాలైనను నీ వాతనియం దలిమక్కువను వీడక యుండుట యతిశ్లాఘ్య " మని పల్కి యామె కనుంగుచెలిమికత్తెయట్లు నటించుచుండెను. ఇట్లుండి యొకనాఁడు క్రీడాదూతి సుకళం బిల్చి " అమ్మా! చాలకాలమునుండి నీ వంతర్గృహమును వీడకుండుటచే శరీరము తెల్లఁబాఱిపోయినది. ఇట్లే యున్నచో శరీరము రోగాకీర్ణమై నీవు వ్రతములు సల్పుటకుఁగూడ వీలు లేకుండును. కాన శరీరమునకుఁ గొంచెముగాలి తగులవలెను. మా క్రీడావనమునకుఁ బోయి కొంతసేపు తిరిగివత్తము ర " మ్మని యామె నొప్పించి యావనమునకుఁ దీసికొనిపోయెను. ఆ వనము

మిగుల శోభావంత మై యుండెను. అయ్యది వసంతసమయము కాకున్నను మన్మథునిప్రభావమున వసంతకాల మావనమం దంతటను సూచింపఁబడెను. కోయిలలపాటలును, ఎలమామిడిపువ్వుల తీయనితావులును, మలయానిలయము యొక్క చల్లనిసోఁకుళ్లును లతామతల్లికల పుష్పగుచ్ఛములు నెంతటి ధైర్యవతి నైనను నిముసమున లోఁగఁదీసికొనున ట్లుండెను. ఆవనమున నొకమామిడిగున్నక్రిందఁ గూరుచుండి యొకరూపవంతుఁడగుజవ్వనుఁడు సుకళపైఁ గ్రేఁగంటి చూపుల నిగిడించుచుండెను. అతఁడు మెల్లమెల్లన నామె దరి కరుదెంచి "అమ్మాయీ! నే నెన్ని ప్రయత్నములు చేసినను నా యభీష్టమున కనుమతి సేయకపోతివి. నావాలు చూపులను, భావములను లెక్కసేయక, నేను పంపినదూతి పలుకు లైనం జెవి యొగ్గి వినకపోయితివి. ఇంక నైనను నా కనుమతి నిచ్చి నాకోరిక నెఱవేర్పుము. మారుని విరికోలలకు నేఁ దాళఁజాలకున్నాను. నాయుసురు నిల్పుము." అని బతిమాలెను. సుకళ యిది యంతయును కపటముగ జరిగె ననియుఁ, దనయొద్ద నున్నదూతి యిట్టిసంధాన మొనర్చెననియు నెఱిఁగి యత్యుగ్రమూర్తిని యై "ఓయీ! వాచాలా! ఏమి నీసాహసము? నిర్భయుఁడ వై మావనమునఁ బ్రవేశించి యెన్నిమాఱులు నిన్నవమానపఱచుచున్నను సిగ్గులేక దొంగ వై యెంతటిపేరు సంపాదించుచున్నావు? నీవు మా నవజన్మము నెత్తుటలేదా? ఛీ! దురాత్మా! ఇటనుండి వెడలిపొమ్ము. తత్క్షణమే వెడలిపొమ్ము. ఈమె న న్నేమి చేయఁ

గల దని మాత్రము గర్వపడకుము. ఇంతకాలమును నీ తప్పుల కోర్చియుంటిని. ఇఁక సహింపఁజాలను. ఇటనుండి వేగమే కదలిపోకున్నచో దారుణశాపాగ్నిని నిన్ను దగ్ధము చేసివైతును. దానిం ద్రిప్ప మఱి బ్రహ్మాదులకును దరము కాదు సుమీ!" అని కఠినముగఁ బల్కెను. ఇంద్రుఁడును బతివ్రతా మాహాత్మ్యము నెఱిఁగినవాఁ డగుటచే మిగుల భీతిఁ జెంది మదనునితోఁగూడ దేవలోకమున కేఁగెను. క్రీడాదూతియు సుకళాదేవి యింద్రుని దిట్టుచున్న సమయమునఁ జల్లచల్లగ దాఁటిపోయెను. సుకళయు నంతర్గృహమునకుఁ బోయెను.

తుదకు సత్యమే జయించెను. అది తనచేత నున్న యస్త్రమున నధర్మమును, గామమును దగ్ధము చేసివైచెను. ఈ సుకళాచరిత్రము నంతటిని విని ధర్మము స్వగృహమునకు వచ్చుచున్నకృకలుని దారిలోఁ గలిసికొని 'తూ, చా' లు తప్పకుండ నతనికి విన్నవించెను. మఱియు ధర్మము "కృకలా! నీసతివంటి యుత్తమసతి జగతిని లేదు. ఆమె నీకై విలపించుచుఁ గృశించుచున్నది. గృహస్థునకు భార్యయే సకలతీర్థములును. భార్య యున్ననే కాని పురుషునకు ధర్మకార్యాచరణమునఁ దావు లేదు. భార్యయే పురుషునిపుణ్యము, భాగ్యము, భోగము. ఆమెను విడిచియుండుట తప్పు. ఆమె విలపించినచో నెన్నఁడును గృహస్థునకు లాభము కలుగఁ జాలదు. కాన నీవు వేగముగ నీయింటికిఁ బోయి నీకై కృశించియున్న నీభార్యం గలిసికొని యిఁక నెన్నఁడు నామెను

విడువక సుఖముగ నుండు" మని చెప్పెను. కృకలుఁడును వేవేగమే తనతీర్థయాత్రలను ముగించి గృహామునకు వచ్చెను. మగఁడు వచ్చుచున్న సంగతిని ముందుగనే తెలిసికొని యతనిని మిగుల గౌరవముతోఁ దీసికొని వచ్చి యాతని పాదరజమును దనసీమంతమునఁ దాల్చి యర్ఘ్యపాద్యాదుల నొసంగి సుకళ పరమానందమున మిన్నందుకొనెను. అంతటినుండియు నా పవిత్రదంపతులు లోకమున కాదర్శభూతులై సుఖంబుల నందుచుఁ బుత్రపౌత్త్రాభివృద్ధితో నుండిరి.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.



Kesari Printing works, Madras.